శ్రీ

# వేంకటేశ్వర ప్రార్థన

శ్రీత్యాడ - పూషవాడ్వీరప భూవల్లభకృతము.

ఇయ్యది

విశాఖపట్టణంబున

శ్రీశారదామకుట ముద్రాక్షరశాలలో

గ్రంథకర్తగారిచే

ముద్రింపించి

ప్రకటింపఁబడియె.

VIZAGAPATAM:

PRINTED AT THE S. S. M. PRESS.

1910.

శుభమస్తు.

# శ్రీ వేంకటేశ్వర ప్రార్థనాపదము.

శ్రీరామరఘురామా- సీతాపతేరామా- సాగిమ్రొక్కు
చునిన్ను- సన్నుతించెదనూ॥ ౧॥ హరినామ గిరిధామా -
యార్తరక్షణకామా-అంజలిఘటియింతు- సౌదలనుతింతూ॥
౨॥ నీపాపలమునుమీ- నీలవర్ణస్వామీ-కాపాడిసిరులిమ్ము-
కరుణతోమమ్మూ॥ ౩॥ మూషకవాహనా- ముల్లోకమోహ
నా- మ్రొక్కెదసుచరితా- ముక్కంటిపుత్రా॥ ౪॥ వెనక
య్యనీకన్నా- ఘనులెవ్వరికనెన్నా- నినుఁదలంచకయున్న-
పనులుగావన్నా॥ ౫॥ నీకటాక్షమునింపూ- నిర్విఘ్నమొన
రింపూ- మాకుఁబాలింపు మీ-లోకమునఁబెంపూ॥౬॥ నలు
వపట్టపురాణీ- నవలాశిరోమణీ- వలుకులపూబోణీ- జలజాత
పాణీ॥ ౭॥ తలచివేఁడెద నిన్నూ- దయజూడవేనన్నూ- తల
వాకిటవసించీ- తప్పసైరించీ॥ ౮॥ భారతీ నానోటా- పాడిం
చుమీపాటా - సభవారుమెచ్చఁగా - చపులుట్టిపడగా॥ ౯॥
వేడుకలానగూడా - యేమఱొండలజేఁడా - వినుముమాతో
గూడ- వేంకటేశ్వరుఁడా॥ ౧౦॥ వాడుకగామీకూ- మూఁ
డు మూఁడేండ్లకూ - పార్థనపేరుననూ - భక్తులందఱునూ॥
౧౧॥ పూజింపుచుందురీ- పుణమిలోపలవారీ- కాపాడుచుం

దువ్వా- కరుణతో నీవ్వా॥౧౨॥ ఆవిధాయుకముగా- నర్చనల్
సేయుఁగా - సరభసంబున మేము - సమకట్టినాము॥ ౧౩॥
శుక్రవారము నేడూ- సూర్యుండుగ్రుంకఁగా- భక్తియుక్తము
గాను- భజన సేయుచునూ॥౧౪॥ కృపజూతువనియెంచీ- యు
పవాసమొనరించీ-స్నానాలుగావించీ-సంతసముమించీ॥౧౫॥
పౌలుపైనహారాంబట్టు- ఘట్టముల్ ధరియించీ- తీరుగానుదిటి
పై తిలకముల్ దీర్చి॥౧౬॥ కలరీతిగా నలం-కారముల్ ధరియిం
చీ- గురుతుమీరగ హెచ్చీ- గోమయము దెచ్చీ॥ ౧౭॥ ఇల్లు
వాకిళ్లలికీ- కల్లాపులునుచిలికీ- చిగురుటాకులతోనూ- చిత్రం
బుగానూ॥౧౮॥ ద్వారాల పందిళ్లా- తోరణంబులు గట్టీ- ము
ద్దులుగుల్కగనూ- ముత్యాలతోనూ॥ ౧౯ ॥ పరమపదవా
కిలీ- తిరుతేరుముగ్గులూ - పరమపాత్రము ముగ్గు - బ్రహ్మ
ముడిముగ్గూ॥ ౨౦॥ శ్రీరంగకోటము-గ్గా రాజు ముడిము
గ్గూ- తలదిండుముగ్గు బృం-దావనము ముగ్గూ॥౨౧॥ పూ
విమానము ముగ్గూ- పుష్పమాలికముగ్గూ-శివునిజడము
గ్గూ కా-శీగుంటముగ్గూ॥ ౨౨॥ కమలపట్టము ముగ్గూ-ఘ
నకిరీటముముగ్గూ - నాగులుముగ్గు క - శాగొత్తి ముగ్గూ॥
౨౩॥ యాగవాటికముగ్గూ-యులరుజాంపము ముగ్గు-హో
మగుండము ముగ్గు- ఉయ్యాలముగ్గూ॥ ౨౪॥ పానుపుము
గ్గు వి-వాహవేదిక ముగ్గు-పసిమిచిక్కుడుకాయ-పందిరిము
గ్గా॥ ౨౫॥ శంఖచక్రముముగ్గా - చంద్రసూర్యులముగ్గు -
పూచెండుముగ్గు బె- బ్బులిగోరుముగ్గా॥ ౨౬॥ తామర

ముగ్గురు ము- త్యాలపందిరిముగ్గా- పొంకమై వెలుగొందు -
శంకాయముగ్గా॥ ౨౭॥ అందంబుగానుంచీ- యతిభక్తిచే
మించీ- చేతులుజోడించీ- జోతలొనరించీ॥ ౨౮॥ దాసులం
దఱుగూడీ- దయసేయుమనివేడీ- నీరాకకై వారు-నిలచియు
న్నారూ॥ ౨౯॥ రావయ్యరావయ్యా- రావేలమాజియ్యా-
యేలరాకున్నావో- యెక్కడున్నావో॥ ౩౦॥ దేవేంద్ర దే
వతలు - దేవదేవాదులూ- నిమాయదెలియంగా- నేరరల
రంగా॥ ౩౧॥ శ్రీదేవిభూదేవి- చెలంగనీళాదేవి-సేవలుసేయం
గా- చిత్తమలరంగా॥౩౨॥ పాలమున్నీటిలో-పల శేషశయ్య
పై- యోగనిద్రాళిలా-నుంటివోచాలా॥ ౩౩॥ సోమకాసు
రువచ్చి- శ్రుతులుబ్రహ్మకునిచ్చి- మచ్చమైజలధిలో-మసలు
చున్నావో॥ ౩౪॥ తరికొండవెంబ్బునను-ధరియించిబడలికనూ-
కూర్మమైపుడమిలో-గూడుచున్నావో॥ ౩౫॥ ధరముట్టుకొని
పోవు- దానవేంద్రునిద్రుంచీ- వరహావతారమై-వసుధనున్నా
వో॥ ౩౬॥ భక్తునకశ్యపుజించీ - ప్రహ్లాదునరక్షించీ - నరసింహ
మూర్తినై-నగమునున్నావో॥ ౩౭॥ బలిచక్రవర్తిని- పాదంబు
నవడంచీ- వటుడనైవాని వాకిటనిలచినావో॥౩౮॥ ఇఱువది
యొకమారు- నిలరాజులనుజీరి- పరశురాముడవగుచు-శర
ధినున్నావో॥ ౩౯॥ రావణాదులద్రుంచీ- రాజ్యంబువిరమిం
చీ- రఘుపతివై వేమ-రహితమైనావో॥ ౪౦॥ బలరామమూ
ర్తివై- యిలనక్కడున్నావో- అలప్రలంబాసురుని-హతము
గావించి॥ ౪౧॥ కాలుచేతులులేక- కలిబుద్ధహానై- నీలాచ

లమునందు- నిలచియున్నావో॥ ౪౨॥ కలికావతారమై-యి
లనెక్కడున్నావో - ఖలులైనమ్లేచ్ఛులను-ఖడ్గమునద్రుంచా॥
౪౩॥ కనుఁగొనలేమయ్యా- ఘనమైననీమాయా- కనికరమ్ము
నమమ్ము- కరుణించరమ్మూ॥ ౪౪॥ సరగుననీపూజా- సల్పుట
మావంతూ- గరిమతోడుతమమ్ము- గావనీవంతూ॥ ౪౫॥ త
ప్పనిసరిసుమా-దయనేగుదెంచుమూ- యేడుకొండలుదిగీ-వే
డుకలదూగీ॥౪౬॥భక్తవత్సలుడంద్రూ-పండితుల్ పెక్కంద్రూ-
అదియథార్థము సేయా-నరుదెంచనయ్యా॥ ౪౭॥మముకృతార్థు
లజేయా- మాపాపములుబాయా- రక్షింపనీవుప్ర-త్యక్షమై
నావు॥ ౪౮॥ మకరికాకుండలా- మణికరీటములతో- రక్షిం
పనీవు ప్ర-త్యక్షమైనావు॥ ౪౯॥ శంఖచక్రగదాసి- చతురా
యుధములతో- రక్షింపనీవు ప్ర- త్యక్షమైనావూ॥ ౫౦॥ కౌ
స్తుభవనమాలి- కాహారకేయూరా- ధారివైనీవు ప్ర-త్యక్ష
మైనావూ॥ ౫౧॥ పసమించుజగడాలూ- పసుపువన్నియశా
లూ- దనరంగనీవు ప్ర-త్యక్షమైనావూ॥ ౫౨॥ భుజములందు
నమూల్య- భుజకీర్తులలరారా- రక్షింపనీవు ప్ర- త్యక్షమైనా
వూ॥ ౫౩॥ రంగుగానలవేలు- మంగమతోగూడి- రక్షింప
నీవు ప్ర-త్యక్షమైనావూ॥౫౪॥ మాకోర్కెలలరారే- మా
నోములీడేరే-మేముధన్యులమైతి-మీసురాధీశా॥౫౫॥ మా
కులంబునుమేమూ-మాయిళ్లు వాకిళ్లూ-నేడుపావనమయ్యే-
నీలవర్ణుండా॥౫౬॥ భవదంఘ్రిధూళి సం-పర్కంబుననుగదా-
రాతినాతయ్యెనో-రాజీవనేత్రా॥౫౭॥ దండంబుదండంబూ-

కొండలరాయుండా- వందనము వందనము- వాసుదేవుండా॥
జోహారు జోహారూ- మోహనాంబుదగాత్రా- జేమోద్ప్వ
జేమోస్ప్వ- చిత్రచారిత్రా॥ ౫౯॥ సన్నుతులు సన్నుతులు-
పన్నగాధిపశాయీ- మ్రొక్కెదము మ్రొక్కెదము- మో
క్షప్రదాయీ॥ ౬౦॥ జేజేలు జేజేలు- శ్రీశేషగిరివాసా- చెం
గనాలలవేలు-మంగమాధీశా॥౬౧॥ రత్నాలపీటపై-రమ్యం
బుగానింపూ- రాణింపవసియింపూ- రాణితోడుతనూ॥౬౨॥
పలుకుసాంబ్రాణీ గు- గ్గులధూపవాసనల్-గైకొనిముబ్రో
వూ- కరుణతోనీవూ॥ ౬౩॥ పన్నగాచలశాయీ- జన్నియా
వులనేయీ- దీపంబుదర్శింపూ- పాపములడంపూ॥ ౬౪॥ వీ
లుగాచంద్రునకూ- నూలుపోగన్నట్లూ- నైవేద్యమిదేనీకూ-
దైవాలరాయా॥ ౬౫॥ ధరసముద్రునకుప్పూ- దర్శనంబన్న
ట్లూ- నైవేద్యమిదేనీకు- దైవాలరాయా॥ ౬౬॥ చలిమిడివ
డపప్పూ- చక్కెరబెల్లాలూ- జున్నుమీగడపాలు- జంటితే
నియలూ॥ ౬౭॥ తియ్యమామిడిపండ్లూ- తేనెఖర్జూపనస-తో
నలరటిపళ్లు క- మ్మనిజామిపళ్లూ॥ ౬౮॥ కమలాఫలంబులూ-
ఖర్జూరఫలములు- యిక్షుఖండంబులూ-ద్రాక్షాఫలములూ॥
బహుపానకంబులూ - పంచామృతంబులూ - పాల్పాపిండీకిర
సా - పంచభక్ష్యములూ॥ ౭౦॥ పాయసాన్నంబట్లూ- పం
చదారొబ్బట్లూ- కక్కెరాలు క్కెరాల్-కండచక్కెరలూ॥౭౧॥
అరిశలు గాజగా-యలు చంద్రకాంతలూ-జంతికచుట్టులు-జ
వుటులప్పాలూ॥ ౭౨॥ జిల్లెడగాయలూ- వల్లంకిమడుపులూ-

కలశండబూరెటూ- కజ్జముండాళ్లూ॥ ౨౩॥ పులిహోర చక్ర
పొం-గలియు దధ్యోదనము-సన్న పుటాలింపు-టన్నాలుచద్దీ॥
౨౪॥ కలయుగాచిన నెయ్యి- కలమాన్నమును ప్రప్పూ- శాక
ములు పచ్చళ్లు-చారువడియాలు॥ ౨౫॥ అర్పించితిమి భక్తి- న
లవేలుసంయుక్తి- ఆరగింపుము వేంక-టాచలాధీశా॥ ౨౬॥ వి
డింపఁగా జగ-త్కుక్షి వి మాతండ్రీ- నీబొజ్జనింపఁగా- నేర్తురె
వ్వారూ॥ ౨౭॥ బత్తితోఁ దుతనొక్క- పత్తిరియిడి మొక్క-
భక్తముక్తులొసంగి-బ్రోతువు చెలంగీ॥ ౨౮॥ పండుటాకులు మం
చి- పచ్చకప్రపు తావి- బాగాలు ముత్యాలు-పచ్చిసున్నం
బూ॥ ౨౯॥ విడియమిదేగ్గొమ్ము-వీక్ష్యంబొనర్పుము-యులవే
లుతోఁ చాలా- యానందలీలా॥ ౩౦॥ కలికాలమునను దు-గ్గా
దేవియును నీవు- క్షితిని ప్రత్యక్ష దై-వతములను మాటా॥ ౩౧॥
నిజమయ్యా నిజమయ్యా - నిశ్చయము మోజయ్యా- దాసుల పా
లింటి-దైవంబునీవే॥ ౩౨॥ కరిరాజు మకరిచే-గాసిలి ప్రార్థింప-
కరిఁగాచి మకరిని-బరిమార్చితీవే॥ ౩౩॥ పాంచాలిసభలోన నా-
ప్రార్థింప వస్త్రంబు- లక్షయంబుగనిచ్చి- రక్షించితీవే॥ ౩౪॥
ముక్కుటటుకుల్లిచ్చి - మొక్కుకుచేలునకు - భూరిసంపదలి
చ్చి-బ్రోచినావీవే॥ ౩౫॥ జగములుఁబుట్టింప- తగురీతిఁబా
లింప- తెగువతోఁ హరియింప-దేవుండవీవే॥ ౩౬॥ దండం
బు దండంబు-దాసులము దయయుంచి- ఆయురారోగ్య భా-
గ్యాభివృద్ధిగనూ॥ ౩౭॥ సంతానసౌభాగ్య - వంతులుగాను
మ్ము- దీవించి వేంచేయు- దివ్యతిరుపతికి॥ ౩౮॥ దాసులందఱు

గూడి- దోసిలొగ్గినుతింపా- యతులవేలుతో గూడి- యతిసంభ్ర
మునను॥ ౮౯॥ భక్తులెల్లనుజేరీ- భజనజేయుచునుండా- చ
నుములొలికొండెక్కి-సంతోషమునను॥ ౯౦॥ కవగూడి ప
రమభా- గవతులుకీర్తింపా-యిలను తొండవకొండ-యెక్కి చను
దేవా॥ ౯౧॥ సురసమూహంబు కోరి- విరులువర్షింపఁగా-
యిలనుమూఁడవకొండ- యెక్కిచను దేవా॥ ౯౨॥ వందిమా
గధులుకై-వారముల్ సేయంగా-యిలనునాల్గవకొండ-యెక్కి.
చను దేవా॥ ౯౩॥ రంభాది దివ్యాప్స- రసలు నాట్యముసేయ-
యిలనుఐదవకొండ-యెక్కి చను దేవా॥ ౯౪॥ తుంబురునార
దా-దులు బాడుచుండంగా-యిలనునాఅవకొండ-యెక్కి చను
దేవా॥ ౯౫॥ సందడిగా దేవా- దుందుభుల్ మ్రోవంగా- యి
లను నేడవకొండ-యెక్కి చను దేవా॥ ౯౬॥ వేడుకలనుజొక్కి-
యేడుకొండలనెక్కి-వేంకటాచలముపై- వెలయుచున్నట్టి॥ ౯౭॥
నీదివ్యధామమునా- నిద్రచేకొని వేడ్క- నిజభక్తులను బ్రో
చు-నీకు మంగళమూ॥ ౯౮॥ అఖిలాండకోటి బ్ర-హ్మాండభాం
డోదరా- నిఖిలలోకాధీశా-నీకు మంగళమూ॥ ౯౯॥ సగుణ
నిర్గుణరూపా-విగతపాపకలాపా- నిగమార్థసందీపా-నీకుమం
గళమూ॥ ౧౦౦॥ మాటిమాటికి పాచి- పేటమిరాశిదార్-
కన్నయ్యపట్నాయుఁ-డెన్నెన్నొగతులా॥ ౧౦౧॥ విన్నపం
బొనరింపా- వినివినిమనసులో- నాలోచనమొనర్చి-యంగీక
రించీ॥ ౧౦౨॥ నామభేదములతో- నటియింపుచున్నట్టి- దే
వుఁడొక్కఁడేయంచు-భావమునఁనెంచీ॥ ౧౦౩॥ ఏవిధంబున

నైన - దేవునికృతిసేయ - పావనంబనిమెంచీ - బహుమోద
ముననూ॥ ౧౦౪॥ హయాణశకంబునం-దొప్పు పందొమ్మిది-
వందల పదియవ-వత్సరంబుననూ॥౧౦౫॥ ఆచంద్రతారార్క-
మవనిలో వెలుగొంద-భక్తులా మోదమున-పఠియింపుచుండా॥
౧౦౬॥ ఈపదంబురచించే-నిలలోన శ్రీత్యాడా - పూషవా
ఢ్వేరపా-భూవల్లభుండూ॥౧౦౭॥ వినినఁబాడిన వ్రాసి- నను
వారలకు నెల్లా- శ్రీవేంకటేశ్వరుఁడు-సిరులిచ్చిప్రోవూ॥ ౧౦౮॥

శ్రీవేంకటేశ్వర ప్రార్థనాపదము సంపూర్ణము.



